# గ్రంథాలయసర్వస్వము.

సంపు. ౭ | బెజవాడ - జనేవరు ౧౯౩౯. | సంచిక ౭

## ఆరవ అఖిల భారత గ్రంథాలయ మహాసభ.

ఆరవ అఖిల భారతగ్రంథాలయ మహాసభ ౧౯౩౮ సంవత్సరము డిశంబరు నెల ౨౬, ౨౭ తేదీలయందు కలకత్తానగరమున విశ్వవిద్యాలయము యొక్క "సెనేటు" భవనమునందు జరిగినది. ఈసభకు డాక్టరు రవీంద్రనాధఠాకూరుగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగా నుండిరి. వారికి దేహములో స్వస్థతగా లేకపోవుటచే వారి యుపన్యాసమును వ్రాసిపంపిరి. అధ్యక్షులుగ డాక్టరు ఆనీబీ సెంటమ్మగారిని ఎన్నుకొనిరి. కాని కాంగ్రెసుమహాసంరంభమునందు జిక్కుకొని యుండుటచేత ఆమెకూడ రాజాలక పోయెను. అందుమీద సుప్రసిద్ధాంధ్రులును, కలకత్తా విశ్వవిద్యాలయమునందు ఉపన్యాసకులును నగు సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు అధ్యక్షతవహించిరి. సభ ౨౬ వ తేదీ మధ్యాహ్నము ౪ గంటలకు ప్రారంభమైనది. ఆహ్వానసంఘాధ్యక్షుని యొక్కయు, అధ్యక్షునియొక్కయు ఉపన్యాసములైన పిమ్మట, విషయ నిర్థారకసభ సమావేశమై తీర్మానములను తయారు జేసిరి. అంతటితో నాటి సభ ముగిసెను.

తిరిగి ౨౭ వ తేదీ మధ్యాహ్నము ౧ గంటకు సభ సమావేశమయ్యెను. వంగరాష్ట్రమునకు విద్యాశాఖ మంత్రియగు నసిపూరు సంస్థానాధీశ్వరుడు ఈదినమున అధ్యక్షత వహించెను. వీరి అధ్యక్షత క్రింద కొన్ని తీర్మానములు అయిన పిమ్మట, హుగ్లీ మండల గ్రంథాలయ సంఘాధ్యక్షులగు మనీంద్రదేవరాయిగారు అధ్యక్షత వహించి,

సభను నిర్వహించిరి. సాయంకాలము ఆరు గంటలకు సభ పూర్తి యయ్యెను. ౧౯౧౯ వ సంవత్సరమునందు మద్రాసునందును, ౧౯౨౩ సంవత్సరమునందు కాకినాడ యందును జరిగిన సభలకు పిమ్మట ఈసారి కలకత్తాయందు జరిగిన సభ మిక్కిలి ప్రాముఖ్యత వహించెను. బెల్గాంనందు జరిగిన సభయును ౧౯౨౭ సంవత్సరమున మద్రాసు నందు జరిగిన సభయును కూడ వ్యవధి లేకుండ జరిగినవి. ఈయేడు సభ రెండుదినములు జరుపుటచేత, విషయము లన్నియు బాగుగ చర్చించి తీర్మానించుటకు వీలుగలిగెను. భారతవర్షముయొక్క అన్నిభాగములనుండియు పలువురు ప్రతినిధు లేతెంచిరి. మైసూరు, బరోడా, పుదుకోట, దర్భాంగా సంస్థానముల నుండియు, మహా రాష్ట్రగ్రంథాలయసంఘము, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము, మద్రాసు గ్రంథాలయసంఘముల నుండియు లక్నో, లాహోరు, పాట్నా, అలహాబాదు, డక్కా, కలకత్తా, ఉస్మానియా విశ్వవిద్యాల యములనుండియు పలువురు ప్రతినిధు లేతెంచిరి.

రాబోవుసభ లాహోరునందు జరుగును.

## తీర్మానములు

1 దేశమునందంతటను ధర్మగ్రంథాలయములను స్థాపించుటకు గాను శాసన నిర్మాణసభలు తగిన శాసనములను చేయవలయునని ఈసభవారు కోరుచున్నారు.

2 ధర్మ గ్రంథాలయములను పోషించుటకును అభివృద్ధిచేయుట కును స్థాపించుటకును రాష్ట్రీయ శాసన నిర్మాణసభలు, షరతులేమియు విధించకుండ, విరివిగ గ్రాంటుల నొసంగవలెనని ఈసభవారు కోరుచున్నారు.

3 లోకలు బోర్డులును మునిసిపాలిటీలును తమ యాజమాన్య మున ధర్మ గ్రంథాలయములను స్థాపించి, పోషింపవలెనని ఈసభ వారు కోరుచున్నారు.

4 మహారాజులు, జమీందారులు, సంపన్నులు, మఠములు, ధర్మసంస్థాపనలును, ఇతరులును, ధర్మ గ్రంథాలయములకు విరివిగా సహాయము చేయవలెనని ఈసభవారు కోరుచున్నారు.

5 ధర్మ గ్రంథాలయములను స్థాపించి పోషించుకార్యమును కొనసాగించుటకుగాను గ్రామగ్రంథాలయములను, తాలూకా మండల గ్రంథాలయసంఘములను స్థాపింపవలయునని దేశజుల నీసభవారు కోరుచున్నారు.

6 పట్టణములందును పల్లెలయందును కూడ ఉపన్యాసముల నేర్పరచుటమూలమున జ్ఞాన వ్యాపకమును జేయవలయునని విశ్వ విద్యాలయములవారిని ఈసభవారు కోరుచున్నారు.

7 చదువుకొన్నవారికి, చదువుకోనివారికిని గూడ విజ్ఞానము లభించుటకు తగిన సాధనములను గ్రంథాలయోద్యమమందు వ్యాప్తము జేయునటుల దేశమందలి గ్రంథాలయ నిర్వాహకుల నీసభవారు కోరుచున్నారు.

8 భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణములను ఏర్పరచి తద్వారా 5 వ తీర్మానమునందు జెప్పబడిన ధర్మ గ్రంథాలయముల పనిని నిర్వహించుటకును, అట్లు ఏర్పడిన రాష్ట్రీయసంఘములను అఖిలభారత గ్రంథాలయసంఘమునకు శాఖలుగా చేర్చుటకును, ధర్మగ్రంథాలయోద్యమమును వ్యాపింప జేయుటకై తగిన ప్రచారమును జేయుటకును ఈసభవారు కోరుచున్నారు.

9 భారతదేశ భాషలయందలి గ్రంథముల వర్గీకరణమునకు పాశ్చాత్యగ్రంథవర్గీకరణ పద్ధతులు సరిపోవని అనుభవమువలన తేలినందున, ఈవిషయమును యోచించి, సలహాల నొసంగుటకు గాను ఈవిషయమునందు అనుభవము గలవారిని ఒకసంఘముగా యేర్పరచవలసినదని అఖిలభారత గ్రంథాలయసంఘకార్యనిర్వాహకుల నీసభవారు కోరుచున్నారు.

10 గెజిట్లు, కవున్సిలు రిపోర్టులు, అడ్మినిస్ట్రేషన్ రిపోర్టులు మున్నగు ఉపయుక్తములైన గవర్నమెంటు ప్రచురములను ధర్మగ్రంథాలయములకును విశ్వవిద్యాలయ గ్రంథాలయములకును ఉచిత

ముగా నియ్యవలెనని ఈసభవారు రాష్ట్రీయ ప్రభుత్వమువారిని కేంద్రప్రభుత్వమువారిని కోరుచున్నారు.

11 గ్రంథాలయ పరిపాలనయందు తరిబీతు నిచ్చుటకుగాను, ఒకపరీక్షను యేర్పరచుట అగత్యముగనుక, గ్రంథభాండాగారి పదవిని తగుసమగ్రతతో నిర్వహించుటకు తగిన తరిబీతును పొందిన యువకులు లభించుటకై, ఆపరీక్షకు కావలసిన ప్రణాళికను తయారు జేయవలసిన దని వివిధ విశ్వవిద్యాలయముల నీసభవారు ప్రార్థించుచున్నారు.

12 ధర్మ గ్రంథాలయములను స్థాపించుటయందును స్థాపింప బడినవానికి సహాయము జేయుటయందును దేశమందు వివిధపురపాలక సంఘములును స్థానికసంస్థలును చేసినపనిని ఈసభవారు సంతృప్తితో గుర్తించి అట్టివారు ఇతరులకు మార్గదర్శకు లైనందులకు వారి నభినందించుచున్నారు; మరియు ఏగ్రంథాలయమైన ఖర్చునందు మూడింట నొకవంతు సొమ్మును సంపాదించుకొనునెడల, మిగిలిన రెండువంతు లలో ఒకవంతు స్థానికసంఘములు గాని పురపాలక సంఘములుగాని భరించులాగునను, ఇంకొకవంతును స్థానిక ప్రభుత్వమువారు భరించు లాగునను స్థానికచట్ట నిర్మాణసభవారు, తగిన చట్టములను జేయువల యునని ఈసభవారు కోరుచున్నారు.

13 దేశభాషలందు విద్యగరపుపద్ధతిని ధర్మగ్రంథాల యోద్యమము వ్యాప్తము జేయువలయుననియు, ఆకార్యసిద్ధికై రాష్ట్రగ్రంథాలయ సంఘములు దేశభాషలయందు గ్రంథములను వ్రాయుటకు ప్రోత్సహించవలెననియు, లిఖితగ్రంథములను సేకరించి, సంరక్షింపవలెననియు ఈసభవారు కోరుచున్నారు.

14 కలకత్తా ఇంపీరియల్ లైబ్రరీ గ్రంథభాండాగారిపదవి ఖాళీయగుచున్నందున, ఆపదవికి హిందూదేశజుడై పరిపాలనా సమర్థత గలిగిన గొప్ప విద్వాంసుని ఏర్పరుపవలెనని ఈసభవారు కోరుచున్నారు.

15 ధర్మగ్రంథాలయములు 1860 సంవత్సరపు 21 నెంబరు ఆక్టుక్రింద రిజష్టరీ చేసికొనుటకు ఇయ్యవలసిన రు 50 ల రిజష్ట్రేషను

ఫీజును మాఫు జేయవలసిన దని ఈసభవారు కేంద్రశాసన నిర్మాణ సభవారిని కోరుచున్నారు.

16 ప్రభుత్వమువారు 1867 సంవత్సరమందు చేసిన చట్ట ప్రకారము ప్రతిరాష్ట్రమందును వసూలు చేయుచున్న గ్రంథముల నన్నింటిని, తగిన కట్టుదిట్టములతో ప్రజలను చదువుకొనన నియ్యవలసి నదని ఈ సభవారు కోరుచున్నారు.

17 "లీగు ఆఫ్ నేషన్సు" యొక్క "ఇంటర్ నేషనల్ ఇన్స్టి ట్యూటు ఆఫ్ ఇంటర్ నేషనల్ కో ఆపరేషన" వారియొక్క పనికి తోడ్పడుటకు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

18 జాతీయ వాఙ్మయమును గొప్ప దేశభక్తుల జీవితచరిత్ర లను వ్యాప్తము చేయవలసినదని గ్రంథాలయము లన్నింటిని ఈ సభ వారు కోరుచున్నారు.

19 గ్రామ గ్రంథాలయముల ఉపయోగమునకై ఆకర్షణ వంతములగు కరపత్రములను నూతన గ్రంథములనుండి ఏర్చిన పట్టి లను పట్టికలను ప్రకటింప వలసినదని అఖిల భారత గ్రంథాలయ సం ఘము వారిని ఈ సభవారు కోరుచున్నారు

20 సంస్కృత గ్రంథముల వర్గీకరణ విషయమునను, భారత శాస్త్రముల వర్గీకరణ విషయమునను "ఎటావా" యందున్న శ్రీ విద్యాపీఠమువారు చేయుచున్న గొప్ప కార్యమును ఈ సభవారు అభి నందించుచు, భారత విజ్ఞానాభివృద్ధికి పునాదియగు ఈ కార్యమునకు గ్రంథాలయము లన్నియు తోడ్పడవలెనని ఈ సభవారు కోరు చున్నారు.

21 పరిశోధనా కార్యములకు తోడ్పాటుగా నుండుటకుగాను దేశమందలి గ్రంథాలయము లన్నియు గ్రంథములను పరస్పరము ఎరు విచ్చుకొనుటను ప్రోత్సహించవలెనని, ఈ సభవారు కోరు చున్నారు.

22 రాబోవు సభ జరుగులోపున భారతవర్షమందుగల గ్రంథాలయము లన్నింటి యొక్కయు విశ్వ విద్యాలయ గ్రంథాలయ

ముల యొక్కయు డైరక్టరీ నొకదానిని తయారు జేయుటకు ఈ సభ వారు తీర్మానించుచున్నారు.

23 "పథేర్ దేబ్" "భారతిగీతములు" అను గ్రంథములను నిషేధించుచు చేసిన తీర్మానములను రద్దుచేయవలసినదని ఈ సభవారు కోరుచున్నారు.

24 గ్రంథాలయపరిపాలనా సౌకర్యార్థమై ప్రతిరాజధాని యందును ఆరాజధాని భాషయందొక గ్రంథాలయపత్రికను ప్రకటించుట అవసరమని ఈసభవారు తీర్మానించుచున్నారు.

25 చిన్నగ్రంథాలయములు తమవద్దలేని గ్రంథములను ఎరువు తీసికొనుటకుగాను మండల, రాజధాని కేంద్రగ్రంథాలయములను ఏర్పరచుట అవసరమని ఈసభవారు తీర్మానించుచున్నారు.

26 యువకులచే నడపబడుచు గ్రంథాలయములను జొచ్చి ప్రభుత్వమువారిచే నిషేధింపబడని గ్రంథములనుగూడ పోలీసువారు తీసికొనిపోవుచుండుటను ఈసభవారు తీవ్రముగ గర్హించుచున్నారు.

27 కీర్తిశేషులగు బంకించంద్రచటర్జీయొక్క గృహమును విక్రయమునకు తీసికొని దానిని సంరక్షించుటకు పూనుకొనిన బంకిం సాహిత్యసమ్మేళనమువారికి ఈసభవారు వందనము లర్పించుచున్నారు.

28 లండను నందున్న బ్రిటిషు మ్యూజియంవలె భారతవర్షమునకు జాతీయ గ్రంథాలయముగ నున్న కలకత్తా ఇంపీరియల్ గ్రంథాలయమునందు హిందూదేశమందు ప్రకటింపబడుచున్న గ్రంథముల యొక్కయు, పత్రికలయొక్కయు ఒక్కొక్కప్రతిని ఉంచవలెనని ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

29. వ్యక్తులయొక్క గ్రంథాలయములనుగూర్చి విచారించి అవి శిథిలముగాకుండ నుంచుటకై ఈసభవారు గ్రంథాలయసంఘములను కోరుచున్నారు.

# శ్రీ రా మ దా సా శ్ర మ ము

## శ్రీ కల్పవల్లీ గ్రంథనిలయము, భద్రాచలము.

భద్రాచలమందు శ్రీ కల్పవల్లీ గ్రంథనిలయము స్థాపింపబడి ౧౫ సంవత్సరములు దాటినది. అప్పటినుండియు శ్రీ పా. సీతారామానుజాచార్యులుగారు ఈ గ్రంథాల యాభివృద్ధికై నిరంతరకృషి జేయుచున్నారు. పత్రికలలో పదివేలు ప్రకటించినదానికన్నను, ఉపన్యాసపీఠములపై పలువిధములు గర్జించినదాని కన్నను కేవల కార్యశూరతనే యాదర్శముగా గొని శక్త్యనుసారము దేశసేవ జేయుచున్న గ్రంథాలయసోదరులలో వీరొకరు. దేశభాషాభిమానమున వెనుకబడియున్న యేజన్సీ ప్రాంతమందు వీరి నిరంతరకృషివలన అపరిమితమగు అభివృద్ధిగలిగినది.

గ్రంథనిలయమునకుతోడు గ్రంథమాలను స్థాపించినారు. పఠనమందిరము, రాత్రిపాఠశాల, పరిషత్తు నిర్వహింపబడుచున్నవి. ఇవిగాక వేదశాస్త్ర కళాశాల, పారిశ్రామిక పాఠశాల, గురుకులము, సంచార గ్రంథమండలి, గోసంరక్షణశాఖ లను స్థాపించుటకై ప్రయత్నించుచున్నారు. వీరి మహత్తర సంకల్పమునకు దేశీయు లందరును తోడ్పడుదు రని కోరుచున్నారము.

# ఈశ్వరపుస్తక భాండాగారము, కాకినాడ

ఈభాండాగారము 1860 సంవత్సరపు నె 21 రు చట్టము ననుసరించి, రిజష్టరుకాబడెను. ఇందు ౧౯౨ మంది పురుషులును, ౩౬ మంది స్త్రీలును సభ్యులుగా గలరు. ౧౯౨౭-౧౯౨౮ సంవత్సరమందు ఆదాయము రు 837-10-3. వ్యయము రు 587-2-3. ఒక బంట్రోతు గలడు. ఉదయముమాత్రము తెరువబడును. దొరతనమువారు రు 50 లను, కాకినాడ తాలూకాబోర్డువారు రు 50 లను విరాళముల నొసం

౧౭. ఈవత్సరమునందు రెండుబీరువాలు కొనబడినవి. ౩౧ పత్రికలు వచ్చుచున్నవి. ౫౮ గ్రంథములు ఉచితముగా సంపాదింపబడినవి. ఈగ్రంథాలయమందు రు ౧౫౦౦ లు కిమ్మతుగల 1726 పుస్తకములు గలవు. పురుషులకు ఇండ్లకు 1777 గ్రంథములును, స్త్రీలకు 360 పుస్తకములును ఇయ్యబడినవి. ఈ గ్రంథాలయమందు రు 208 లు కిమ్మతుగల 6 బీరువాలు గలవు.

విరియాల కామరాజు,
జమ్ములమడక గోపాలం,
సంయుక్త కార్యదర్శులు.



# శ్రీరామ గ్రంథాలయము

శివరామ పురము, విశాఖపట్న మండలము.

మన మెల్లరము నాంధ్రదేశమందు జన్మించి యాంధ్రుల మను పేరిట వెలయుచున్నాము. పై పేరును సార్థకము చేసికొనుటకును పవిత్రవంతమగు దేశభాషను పెంపొందించుటకును, అందుండు సంశయములను నివృత్తి చేసికొనుటకును గల పునాది మొద్దియనిన "గ్రంథాల యోద్యమమే" యని తామెఱుంగుదురు. దేశీయవిద్య, దేశసేవ, దేశవస్తు ప్రోత్సాహముల పెంపొందింపజేసి మన పూర్వపు ఔన్నత్య స్థితికి దేశమును గొనివచ్చునదీ యుద్యమమే! భారతదేశము యొక్కయు, భారతీయుల పవిత్ర చరిత్రలున్ను, భారత ధర్మమున్ను, అవతారపురుషుల చరిత్రలున్ను మనము తెలిసికొని యజ్ఞానాంధకారమునుండి విముక్తుల మగుటకు గ్రంథములే ముఖ్యాధారములు. పై పేర్కొనిన వానినెల్లరు సంపాదించుట కష్టసాధ్యము. గావున నట్టి గ్రంథములను సంపాదించుటకును, దేశభాషా సేవకులను వృద్ధి చేయుటకును గ్రంథాలయములే శరణ్యము లని గ్రహించి యీ మా శివరామ పురాగ్రహారమున "శ్రీరామ గ్రంథాలయ"మను పేరిట ధర్మపుస్తకభాండాగార మొండు 1921 సం॥రమున గ్రామస్థులయొక్కయు,

మిత్రుల యొక్కయు సహాయము వల్లను తొలుదొల్త 400 సంస్కృతాంధ్రాంగ్లేయ గ్రంథములతో స్థాపించితిమి. పిదప శ్రీరామ కరుణా కటాక్షమువల్ల నేటికి 700 వందలవరకు గ్రంథముల చేకూర్పజాలితిమి.

ఈ గ్రంథాలయమునకు ఆంధ్రభాషలో బ్రకటింపబడుచున్న మాసపత్రికలు, వారపత్రికలు, దినపత్రికలు తెప్పింప బడుచున్నవి. మఱియు నిత్యము పురాణపఠనమును వారమున కొకటి రెండు సార్లు హరిభజనయును జరుపబడుచున్నవి. బాలుర కుచితముగ విద్యయు జెప్పబడుచున్నది. కాని పై గ్రంథాలయమునకు ప్రత్యేకముగ గృహమొండు లేని కతన పెక్కు యిక్కట్టులకు లోనుగావలసి వచ్చుచున్నది. యేతద్గృహనిర్మాణమునకు యెంతగా యత్నించినను ధనాభావముచే నింతదనుక కొనసాగదయ్యె. నేడు గృహనిర్మాణమునకు స్థలనిర్ణయ మైనది. ధర్మకార్యాభిలాషులగు తమసహాయమే కొఱత పడి యున్నది. మా సాలూరు తాలూకా కిది యొక్కటి మాత్రమే ధర్మగ్రంథాలయము. దీని నభివృద్ధిపఱచుటకు తోడ్పడెదరని ప్రార్థించుచున్నాము.

---

# నాల్గవ అఖిలభారత గ్రంథాలయ ప్రదర్శనము

అఖిలభారత గ్రంథాలయసభతోబాటు గ్రంథాలయ ప్రదర్శనము 1928 సంవత్సరము డిశంబరు నెల 24వ తేదీ మొదలు 28 వ తేదీ వరకు కలకత్తా విశ్వవిద్యాలయ భవనమున జరిగినది. ఈప్రదర్శనమును 24 వ తేదీన కలకత్తా విశ్వవిద్యాలయముయొక్క వైసు ఛాన్సిలరుగారు తెరచుచు ఇటుల జెప్పిరి :—విశ్వవిద్యాలయ భవనములందు ఈగ్రంథాలయ సభయును, ప్రదర్శనమును జరుగుచుండుట మాకు గొప్ప విశేషము. హిందూదేశముయొక్క వివిధ రాజధానులందు గ్రంథాలయోద్యమమునందు పనిజేయు వివిధజనులు కలసికొనుటకు ఇది

యొక్క గొప్ప సావకాశము. దేశమందు విద్యాభివృద్ధికిగాను తోడ్పడు చుండుటచేత గ్రంథాలయోద్యమమునకు సహాయముచేయుట అందరికిని విధియై యున్నది!!

ఈ ప్రదర్శనమునందు బరోడారాజ్యమునుండియు, ఆంధ్రదేశమునుండియు వచ్చిన అనేకపటములు, గ్రంథములు, పత్రికలు ప్రదర్శింపబడినవి. మరియు అడయారు గ్రంథాలయము, గయా గ్రంథాలయము, దర్భాంగా గ్రంథాలయము, మైసూరు గ్రంథాలయ సంఘము, హుగ్లీ గ్రంథాలయసంఘము, మాక్మిల్లనుకంపెనీ మున్నగు వారిచే అనేక ప్రదర్శనవస్తువులు ప్రదర్శింపబడినవి. ప్రతిదినమును ప్రేక్షకులు వేనకువేలువచ్చి ప్రదర్శనమును జూచి భారతవర్షమున వివిధరాష్ట్రములందు గ్రంథాలయోద్యమమునకు జరుగుచున్న పనిని తెలిసికొని యానందించిరి.



## అఖిలభారత గ్రంథాలయ సంఘము

కలకత్తాయందు అఖిలభారత గ్రంథాలయ సభ ముగిసిన పిమ్మట, ఈసంఘముయొక్క వార్షికసమావేశము జరిగెను. సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు అధ్యక్షులుగాను, సూరి వెంకటనరసింహ శాస్త్రి గారు ఉపాధ్యక్షులుగాను, కార్యనిర్వాహక సంఘాధ్యక్షులుగాను, కుమారమనీంద్ర దేవరాయి, (బెంగాలు) యన్. సి. కేల్కారు (మహారాష్ట్ర), సి. వి. రఘునాథ అయ్యర్ (పుదుకోట), కే. వి. కృష్ణస్వామి అయ్యరు' (మద్రాసు), యన్. యం. దత్తు (బరోడా), రావుబహద్దరు యం. శ్యామాంగావు (మైసూరు), లాలా లభూరాం (లాహోరు), పండితపుష్కరనాథరామ్నా (దర్భాంగా), జస్టిసు కేశవరావు (హైదరాబాదు) గార్లు ఉపాధ్యక్షులుగాను ఎన్నుకోబడిరి.

అయ్యంకి వేంకటరమణయ్యగారు కార్యదర్శిగాను దాసు త్రివిక్రమరావుగారు సంయుక్తకార్యదర్శిగాను, ● కళా వెంకటావ్రు

(ఆంధ్ర), డి. డబ్లియు జోసి (మహారాష్ట్ర), డాక్టరు గురుదాసురాయి (బెంగాలు), ఏ. యస్. ముద్దుకృష్ణ (పుదుకోట), సూర్యప్రసాద మహాజన్ (బీహారు), ఎ. శివరామమీనన్ (మద్రాసు), హెచ్చి. ఎస్. వమనాని (సింధు), వై. వి. చంద్రశేఖర అయ్యారు (మైసూరు). యం. ఎన్. అమీను (బరోడా), యూసఫుద్దీన్ అహమ్మదు (హైదరాబాదు), లాలాహార్ దయాల్ ఖన్నా (లాహూరు), గార్లు సహాయకార్యదర్శులుగాను ఎన్నుకోబడిరి.

గ్రంథాలయసభ 9 వ తీర్మానము నందు ఉదహరింపబడిన ప్రకారము గ్రంథవర్గీకరణమునుగురించి యోజించి సలహాల నిచ్చుట కొక సంఘము ఏర్పరుపబడెను.



# గోపాలకృష్ణగ్రంథాలయము, పొందూరు

ఈగ్రంథాలయము తే 17-8-28 దిని 600 గ్రంథములతో స్థాపింపఁబడినది. ఇందు నలువదిమంది సభ్యులు గలరు. ప్రతిమాసమున రు 10-0-0 లు చందాలవల్ల వచ్చుచున్నది. ఇప్పటికి 1300 గ్రంథములచే యీపుస్తకభాండాగారము విరాజిల్లుచున్నది. 8 పత్రికలు వచ్చుచున్నవి. ప్రతిదినము రాత్రులందు 8 గంటలు మొదలు 10 గంటలవరకు, శ్రీమహాభారత సత్కథాకాలక్షేపము గావింపబడుచున్నది. తే 17-12-28 దిని శ్రీ ధర్మరాజు పట్టాభిషేక మహోత్సవము జయప్రదముగాఁ జరుపఁబడెను. ఆనాడు శ్రీ జయంతి కామేశం పంతులు గారు తమ గృహమందు 200 మంది బ్రాహ్మణులకు తృప్తికరముగా సంతర్పణము గావించిరి. నాటిరాత్రి మయూరధ్వజచరిత్రము హరికథాకాలక్షేపము జేయఁబడినది.

పేరేపు అన్నాజీరావు;
సహాయకార్యదర్శి.

# ఆంధ్ర ప్రబోధినీ గ్రంథాలయము, రాశీపురము
## సేలం జిల్లా

ఆంధ్రేతరమండల మనదగు ద్రావిడదేశములో నాంధ్రసోదరులు అనేకులు శతాబ్దములకొలది స్థిరనివాసము గైకొనియుండు విషయమును, వారలు ఆంధ్రమును ఇండ్లలో మాట్లాడుకొనుటమాత్రమే కాని ఆంధ్రభాషాపఠనపరిచయమును, మీదుమిక్కిలి ఆంధ్రత్వమునుగూడ గోల్పోవుచుండు విషయమును అంద ఱెఱింగినదియ.

ఇటీవల యాంధ్రమండలమునం దుద్భవించిన ఆంధ్రోద్యమతత్త్వము దేశమందెల్లెడలను బ్రాకి ఆంధ్రేతరమండలములలో నుండు ఆంధ్రులకుసైతము మాతృభాషాభిమానమును, ఆంధ్రసోదరత్వాభిమానమును బురికొలుప తలపడియున్నది. ఈసమయమున గ్రంథాలయోద్యమనాయకులగు శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారిని ప్రశంసింపవలసియున్నది. శ్రీపంతులుగారు చేయుచుండిన మహాత్కార్యముల నప్పుడప్పుడు మేము గమనించుచుంటిమి. బహుశా యీ ఆంధ్రప్రబోధినీగ్రంథాలయ మేర్పడుటకును శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యపంతులుగారే ముఖ్యకారణమని చెప్పవచ్చును. మఱియు ద్రావిడదేశాంతర్గత మండలములలోని ఆంధ్రసోదరులు కొందఱు ఇటీవల ఆంధ్రోద్యమతత్త్వము నెఱింగి ఏత దుద్యమమునకు సహాయు లగుచుండుటయు ప్రత్యక్షము. అయినను వేలకొలది యాంధ్రులు ద్రావిడదేశమునందు తమ ఆంధ్రవ్యక్తిత్వము నెఱుంగక నివసించుచున్నారు. అట్టివారల కందఱికిని మాతృభాషాభిమానమును కలిగించి ఆంధ్రులతో సంఘీభావ మూనునట్లుచేయుట కెంతో ప్రచార మవసరముగ నున్నది. ఇట్టి విషయముల గమనించి ఈపురమునందు ఆంధ్రప్రబోధినీ గ్రంథాలయము యేర్పరుపబడియున్నది.

ఆంధ్రములో నుపన్యాసము లిప్పించియు, కరపత్రములు బ్రకటించియు నీమండలమునందలి యాంధ్రసోదరుల కందరికిని మాతృ

భాషాభిరుచిని కలిగించి తద్వారా విజ్ఞానమును, దేశాభిమానమును గలిగించుటయే ఈగ్రంథాలయముయొక్క ముఖ్యోద్దేశము.

ఇప్పటికి ఈగ్రంథాలయము 300 గ్రంథములతో విరాజిల్లుచున్నది. ఇందులో కొన్ని పురాణములు, కొన్ని నవలలు, కొన్ని విజ్ఞానబోధకములు, కొన్ని అలంకారములు మున్నగునవి, ఇవిగాక సమదర్శిని మున్నగు వార్తాపత్రికలును వచ్చుచున్నవి.

ఆంధ్రులెల్లరు నుచితముగనే గ్రంథాలయోపయోగము నందుచున్నారు. ద్రావిడదేశస్థులగు ఆంధ్రులకు ఆంధ్రాభిమానమును కలుగజేయు నుద్దేశముతో నేర్పడినదిగనుక ఇందలి సభ్యులకును, అభిమానులకును చందా మున్నగు రుసుము లొక్కటియు నియమింపఁబడలేదు.

దీని యుద్దేశమును గమనించి "త్రిలింగ" "తెలగ"లను పత్రత్పత్రికాధిపతులు ఉచితముగనే పంపి యుపకరించుచున్నారు. భాషాభిమానులును, దేశాభిమానులును ఇందుకు వీలైనంత సహాయము చేయ బ్రార్థించుచున్నాము.

—అ. రామస్వామయ్య,
కార్యదర్శి.

## సారస్వత నికేతనము, వేటపాలెము

ఈగ్రంథాలయము యొక్క 15-9-27 మొదలు 5-10-28 వరకు గల వార్షికచరిత్ర మాకు చేఁనది. ఈవత్సరమున రు 1678 లు శాశ్వతవిరాళము లియ్యబడినవి. రు 500 లు వాగ్దానము చేయబడినవి. ఈనిలయమును స్థాపించి, తదభివృద్ధికై విశేషశ్రమను జేయుచున్న ధర్మకర్తలగు శ్రీ ఊటుకూరి వెంకటసుబ్బరాయ గుప్త గారు తమకు గ్రంథాలయమువలన రావలసిన రు 1388-9-0 లను

విరాళముగ అనుగ్రహించిరి. వేటపాలెం యూనియన్ బోర్డువారు రు 50 ల విరాళమును మంజూరు జేసిరి.

ప్రతి వత్సరమును బ్యాడ్మింటన్ పోటీ యాటయు, చెడుగుడు పోటీయాటయు వార్షికోత్సవ సమయమునందు ఆడుబడుచున్నవి. వీరికి రజత పతకములును, సదా తిరుగుచుండెడి రజత పాత్రలును్ బహుమతి ఇయ్యబడుచున్నవి. ఆంధ్రవ్యాసరచన పోటీపరీక్షలలో గెలుపొందిన వారికి సువర్ణపతక మొకటియు, రజతపతకములు రెండును ఇయ్యబడినవి.

ఈనికేతనమునకు ఒక గ్రంథభాండాగారియును, ఒక సేవకుఁడును గలరు.

ఈనిలయమునకు రు 7,384 లు మూలధనముగలదు. ఈవత్సరము రు 2254-3-11 లు ఆదాయము గలదు. అదియంతయు వ్యయమైనది. ఆదాయములో ధర్మకర్తగారి పెట్టుబడి రు 1203-2-5 లు గలదు. వివాహాది శుభకార్యములందును, పర్వదినములందును రు 481-15-0 లు వసూలయ్యెను. ఒకదాత బీరువాకు కావలసిన సొమ్మునిచ్చిరి.

429 గ్రంథములు దాతలచే నొసంగబడినవి. మఱికొంతమంది గ్రంథములను తగ్గింపు ధరలకు ఇచ్చియుండిరి. 12 గ్రంథమండలులకు చందాదారుగా చేరియున్నది. 29 పత్రికలు వచ్చుచున్నవి. కొందరు దాతలు 4 బీరువాలను ఒక మడత డ్రాయరును, ఒక పెట్టెను, ఒక లస్టర్‌ను కొని యిచ్చిరి. ఈ వత్సరమున 12 ఉపన్యాసములును, ఒక నగరసంకీర్తనమును, ఒక హరికథాకాలక్షేపమును, పురాణకాలక్షేపమును నూతన పంచాంగ శ్రవణమును జరిగెను.

ఈగ్రంథాలయమునకు రు 15,706-9-6 లు విలువ గల ఆస్థి గలదు.

ఈ నికేతనము శ్రీ కాళయుక్తి నామసంవత్సరమందు ప్రతిష్ఠింప బడినది. తదాది, సక్రమాభివృద్ధిని పొంది, "సుబ్రాయ మహాల్" యను విశాలమైన స్వంతభవనమును గలిగి యున్నది. ఉచితగ్రంథాలయము, ఉచితపఠనాలయము అను రెండు ప్రధానాంగములను కలిగి యున్నది.

5000 సంస్కృతాంధ్రాంగ్లేయ గ్రంథరాజములు గలవు. ఇందు వేదాంతగ్రంథములు, మతగ్రంథములు, వైదిక గ్రంథములు, పురాణములు, ఇతిహాసములు, జ్యోతిష, ధర్మ, వైద్య, వ్యాకరణాలంకార, అర్థశాస్త్రములు, దేశచరిత్రలు, జీవచరిత్రలు, నవలలు, నాటకములు, నిఘంటువులు, కథలు, పద్యకావ్యములు, గద్యకావ్యములు, రాజకీయ గ్రంథములు, సంగీత శాస్త్రములు, వ్యాయామగ్రంథములు, వాస్తుశాస్త్రములు, ప్రహసనములు, ఆరోగ్యశాస్త్రములు, ప్రకృతిశాస్త్రములు, వ్యవసాయశాస్త్రములు, భూగోళ శాస్త్రములు, గణితశాస్త్రములు, శతకములు, స్తోత్రములు, ఉపనిషత్తులు, స్మృతులు, అవధానములు, చాటువులు, హరికథలు, జంగంకథలు, వినోదములు, కీర్తనలు, వ్రతములు, మాహాత్మ్యములు ఇత్యాది వివిధ గ్రంథరాజములు గలవు. గ్రంథాలయములోని గ్రంథములను స్త్రీపురుషు లెల్లరకు పఠనార్థ ముచితముగ వారివారి గృహముల కొసంగ బడుచుండును. గ్రంథములను మంచి స్థితిలో తెచ్చి సకాలమునకు వాపసు యీయ బడగలందులకు పాఠకుల యొద్దనుంచి యొప్పుదల పత్రికలు వ్రాయించుకొనబడును. గాని వారియొద్దనుంచి రుసుము యేమాత్రమును వసూలు చేయబడదు. ఈ గ్రంథాలయము నుండి యీ సంవత్సరములో గ్రంథములను ఎరువు దీసికొనిన పురుషుల సంఖ్య 274, స్త్రీలు 56: పురుషులచే చదువబడిన గ్రంథములసంఖ్య 3155, స్త్రీలచే చదువబడిన గ్రంథములసంఖ్య 216. 20 పరిసర గ్రామములవాసులు గూడ గలరు. ఈపఠనాలయము నిత్యము 25, లేక 30 పాఠకులతో శోభిల్లుచుండును.

శ్రీ సీతారామాంజనేయ భజన కాలక్షేపముల శాఖయొకటి యీ నికేతనమున కనుబంధముగ చేర్పబడినది. నికేతనమందిరమునందు ప్రతి ఆదివారము భజనకాలక్షేపములు జరుప బడుచున్నవి. రు 25/- ల మూలనిధి నొసంగిన భక్తుని గోత్ర నామములతో సంవత్సరమున కొకతూరి భజన కాలక్షేపము, పూజార్చనలు, ప్రసాదవినియోగము జరుపబడుట కేర్పాట్లు జరుగుచున్నవి. ఇందు సగభాగము పూర్తియైనది. శేషించిన సగభాగము భక్తులసహాకారమువలన సమకూడవలసి యున్నది.

ఈ సారస్వతనికేతనము, ఇహపరసాధక జ్ఞానాన్వేషణతత్పరు లెల్లరు సద్గ్రంథావలోకనము గావించి యందలి సారస్వత విశేషములను, ఆధ్యాత్మిక తత్వ జ్ఞానసారమును పొందగలిగినట్టి, పవిత్ర స్థానమై యొప్పుచున్నది. పెద్దల యాశీర్వచనముల బొంది సర్వజనాళికి కేవలము యభిమాన నికేతనమై శోభిల్లుచున్నయది.

ఈ నికేతనము 1860 సంవత్సరపు 21 వ ధర్మసంస్థాపనల చట్టము క్రింద రిజిస్టరు చేయబడినది.

మూలనిధిమీద ఆదాయము వ్యయమునకు సరిపోవుటలేదు.

స్థిర పునాదులపై నిలువబడి దశవర్షప్రాయమై యొప్పుచు, సర్వతోముఖమగు, సాహిత్యామృతమును వెదజల్లుచున్న యీశారదాలయపోషణార్థము సహాయముచేయ ప్రార్థితులు.

---